# ప్రకటన.

చదువరులారా!

మొదట నేఁ గొన్ని రామభజనకీర్తనలును, నీ పాటలను, జేర్చి ముద్రింపించవలెనని యత్నించితిని. నా స్నేహితులు కొందఱు కీర్తనలును, బాటలును, నొక్క పోత్తముగఁ జేర్చుట యనుపయోగమని బోధించుటచేతను, కొందఱు సతీతిలకములును యట్లే యనుటవలనను, కీర్తనలను బ్రస్తుతముమాని పాటలమాత్రము ముద్రింపించినాను. స్త్రీలకును, బురుషులకునుగూడ సర్వకార్యములయందును మంగళహారతు లుపయోగకరములగుటచే ముప్పదినాలుగు మంగళహారతు లిందు లిఖించి కొందఱియభిప్రాయానుసారముగాఁ బువ్వుబంతిపాటలు కొన్ని యిందు వ్రాసినాను. మఱియు తలుపుదగ్గిరపాటలు, వదునపాటలు, మొదలగునవియు నిందుఁ గలవు. సాధ్యమయినంతవఱకు వాటివాటి రాగములును, కొన్నికొన్ని మట్లును, పొందుపఱచినాను. కావున వీటిని చదువనభిలషించు యోషిజ్జనంబులు ఘణుతులు గుర్తెఱింగి సాధ్యమయినంతవట్టు చదువఁగలందులకు నభిలషించుచున్నాను.

ఇట్లు,

కె. గూడె కృష్ణయ్య.



శ్రీ.

గణాధిపతయేనమః

శ్రీసుమాగణపతి సార్థివేశ్వర దేవతాభ్యోనమః

1. విఘ్నేశ్వరమంగళహారతి:—నాథనామక్రియ. ఆట.

మంగళమోగణపతి । పరహితమతి ॥మంగ॥ మంగళదాయక। మహితగణ నాయక । గంగాధర ప్రియసుతా । సుగుణాన్విత ॥మంగ॥ విఘ్నార్థ కారసావిత! కలితాహిత । విఘ్నాటవీదహన। ఆఘువాహన ॥మం॥ లంబోదర సుగుణా, శంబాశ్రీహేరంబ । కంబుకంధరసుందర। శ్రితమందార ॥మం॥ అవనిగూడకృష్ణ।కవిపోషణ జగపవనకార్యకారణా। హతసంసరణా ॥మంగ॥

2. సరస్వతీమంగళహారతి। బేహాగ్—రూపక

సరసీజా సనురాణీ ॥జయహారతిజననీ॥ కరుణామయి।వరదాయిని। సరసిజపాణి ॥సర॥ వాణీయలివేణీచకితైణాలోచనీ ॥సర॥ ధరకొల్లి వుర భారతీ । వరమందిరనిలయే ॥సర॥ ఇలగూడకృష్ణ హృదయ। సలలితగేహే॥సర॥

## 3. వ మంగళహారతి! కల్యాణి! ఆది

మామనోహర। జయమంగళ మోహన। మాన
గుణాకర ॥మా॥ కామజనకను।త్రి ముపూజితపద। తా
మరసయుగళ । కామితఫలదారా। ధామనోహర,ధీర।నా
గజభీతిహరా సుగుణగణధామ ॥మా॥ సంగరహిత భవ।
భంగ విహంగతు । రంగమంగళదాయక । సంగీతలో
లాగో।పాంగ నాగారయ॥ మంగళహారణభు।జంగశయా
నా ॥శ్రీమామ॥ సారచరితభవ ।దూరావారాశిగం । భీ
రా ! శుభఫలదాయకా ధారాధరాభశ । రీరమహామే
రు। ధీరా;నరాదకాం। తారం వైశ్వానర॥మామ॥సరసిజనా
భసం। సరణాబ్ధితరణాభూ। భరణాముఖజితతుహిన।కిరణా
పెరవలివురా।వరణాగూడకృష్ణ।పరిణామకారణ।నిరుపమ
తోషణ ॥మామ॥

## 4. వ మంగళ హారతి: బేహాగ్? ఆది.

జయజయమామనో।జలజాతబంధర॥జ॥నయవిచా
రణ కుశే। శయనళలోచన ॥జయ॥ భక్తమానసాబ్జని।
వాసావిలా-। నక్తంచరసంశవి । నాశారమేశా ॥జ॥ స
లలిత కీర్తిజావి।శాలాగోపాలా। నళినసంభవముఖ । నాకా
కసావన ॥జ॥ కరుణాలవాలా! శుభంకర కేవల రూపక।ధ
రగూఢ కృష్ణకవి। వరవరదాయక ॥జయజయ॥

### ౫. వ మంగళ హారతి! జంఝూటి—ఆట

కస్తూరహారతి। నేర్పుతోమీరున। మర్పణసే యరె। దర్పజనకునకు ॥క॥ పొంబళ్ళెరముల। నింబు గంగ్రైకొని। డంబుమీఱంగమన। యంబుజోదరునకు ॥క॥ పురుషోత్తమునకుఁ ।బుణ్యాకలితునకు। గరుడగమనునకు। ఘనయశోపేతునకుఁ ॥గ॥ నారాయణభవ। తారణదీనా వన। నారచరితమును। సారెకుఁ బోవ్రుమని ।క॥ సుం దరరూపజిత। సూనశరశతునకు। నందనందనునకు। నవ నీతచోరునకుఁ ॥గ॥ పెరవలిపురవరాం। తరనివాసునకు నిం। దిరారమణునకు భూధరధరునకివుడు ॥కర్పూ॥

### ౬. వ మంగళహారతి' హిందూస్తానితోడి-ఆట

హార।తియదుపీం। సారసాయతదళలోచన। సం। సారభయార్తివిమోచన। నారాయణ ఆర్తత్రాణ పరా యణ ॥హార॥ భక్తమనోభీష్టదాయకా।ఘోర। పాతకావ నిజాకుఠారకా । మాక్తికకలితస । మంజసగ్రైవేయా ॥హార॥ లాలితసుగుణరత్నాకర। సం। పాలిత వారణరా ద్వర । నీలాంబుదాభస । న్నిభసుందరాకారా ॥హార॥ ధరగూడకృష్ణ హృన్మందిర । ధీర । నిరుపమసౌఖ్యసం ధాయకా । పెరవలిపురవరాం।తరవాసానువిలాసా॥హార॥

7. వ మంగళహారతి! బేహాగ్—ఆట

హారతీవసు దేవనందన।శ్రీతచందన॥హా॥ నీరదాభన। నీరజాయుతవి। దారధీరకయూనిధే ।హా॥ నారదాదిమునీంద్ర సన్నుత। నమితాహిత। నారమణీమణు। హారజగదు। ద్ధా గభూరిశ్య పాకర హా॥ పూతనానిజ జీవితాహార। పుష్టలా కారి। పాతి కావనీ।జాతనికర। శాతఘోరకుతారక ।హా॥ సత్యభామామనోజ్ఞరోలంబ । సద్గుణాలంబ । నిత్యపిగ తా। సత్యయఘురా । హిత్యదీనదయాపర ॥హా॥ గూఢక్ర ష్ణకవీంద్రహృద్వాస । గుణతరోల్లాసా । శీలకాంచన । చేలశుభగుణ।జాలయదుకులభూషణ ॥హారతీ॥

8. వ మంగళహారతి! సావేరి:—ఆది

మంగళమోయదు । పుంగవ కరుణచె ।లంగగనో నుముహే। మాంగతురగజయ ॥మంగ॥రంగుమీఅంగనో సంగెసనాదుదో । సంగూడ చిక్కావంగ నలచియిదె ॥మం॥ కన్నతండ్రియా। పన్నుల మొకనీ। కున్నయక్కటిక। మున్నెయొరులకని । యున్నిగతులనీ । చిన్నియడుగుతె ద । నెన్నుచుకొంగిపి । పన్నగశయనుండ ॥మం॥ ఎమ్మె యినను । బాపమ్ముపొరయనిప । ధమ్ముమంజొనిపిము। దమ్ముననగూర్చెదో । తమ్మికంటి నమ్ముకొంటిని క

ద్ర । వమ్ము వేరితను । లిమ్మహీ లేరని ॥మం॥ శిష్టులైన కృపఁ । జూడుమనరుని చెలికాఁడనన్నువిడ । నాడనలదు నీ వాఁడనిన్నుమది । వేఁడెఁబాపములు । వీడనంట ।గూడి కృష్ణపోషక ॥మంగ॥

౧౧. ఈ మంగళ హారతి-హిందూస్థానితోడి:—రూపక

యదుకులాబ్ధిసోమనీకు । నిదిగో హారతీ । విదురాక్రూరవరదా శోభ । నదపరాత్పర ॥యదు॥ దేవకీకిశోర వాసు । దేవశ్రీనిధే । భావజజనకాయశేష । భాగ్యదాయక ॥యదు॥ పరమపురుషనిత్యమోహన । వరపరాత్పర । సరసిజాక్షగోవర్ధన । ధరాధరధర ॥యదు॥ పరవలిపురవర నివాసా । విమలమానసా । ధరణిగూడకృష్ణపోష । ధరిత్రీలాలసా ॥యదు॥

౧౨. రామునిమీఁదిమంగళహారతి—ఘంజు:—ఆది

కర్పూరహారతిఁ । గైకొనుమో । రఘువర ॥క॥ స్ఫీతరాసన । ధ్వంసకరా । రఘువర॥క॥ ఖరదూషణప్రముఖాసురభంజన । సరసిజబాంధవకులాభరణ ॥రఘు॥ పితృవాక్యపరిపాలన శీలదా । ఏతమనుజాళన హృదయ చయ ॥రఘువర కర్పూర॥ ఆంజనేయపరిసేవిత సత్పద । కంజవిభీషణ భయహారణ ॥రఘువరకర్పూ॥ కరుణామృత

కూ। పాపదురితహార। ధరణిపెరవలిపుర । వరనిలయా రఘువర ॥కర్పూరహారతి॥

## 11. మంగళహారతి—జంఝూటి—ఆది.

జయజయరఘుకుల। జలనిధిహిమకర॥జ॥ జయజయ జానకీజానీ–పరాత్పర ।జయ॥ దయామయ నీపద। తామర సములహృ।దయమున నిలిపితి। దశవదన శమన ॥జయ॥ మండితహారకో।దండ విఖండన।ఖండనభీమ మా।ర్తాండ కులభూషణా ॥జయ॥ పతిగారాజసి।సల్పినదారవని।పతిత పావన నిను।మతినిడివేడితి ॥జయ॥ ఈడితకీర్తి ప్రవి।శాలక్ష్మా పాకర।గూడకృష్ణసుకవి వేడెదఁబరా కేలరా ॥జయ॥

## 12. మంగళహారతి—జంఝూటి—ఝంప.

ఇనకులాబ్ధిసోమ నీకు।నిదిగోహారతీ। ఘనఘనాభ సుందరాంగ।కొనుముహితమతి।నీరా। జా।క్షా।మునిమనో విహార రఘువర॥ఇ॥గాధినందనాధ్వరరక్షు।కదయానిధే। సా ధుజన మనోబ్జనిలయ।మైథిలీప్రియా।సా।రా।క్షా।రా।నా ధానాధ రక్షకాహరే ॥ఇనకు తనుచరేంద్ర సేవితాంఘ్రి సరసిజా; దయాకర।పరాత్పరా నరాదవరమదాపహా। దే। వ॥ దే।వా। నిరుపమాన దివ్యవిగ్రహా ॥ఇన॥ సతతమంజు భాషణా; శ్రిత జనావనా।వితతనూత్న రత్నఖచిత విమల

భూషణా। దీ। నా। వా।స క్షితినిగూఢ కృష్ణపోషణ ॥జ॥

### 13. మం॥ కేదారగౌళ — ఆట.

మంగళ మిదె రఘు పుంగవనే నొసఁగు ॥మం॥ మంగళ
కరవిభవ। భంగపరాత్పర ॥మం॥ జనక జాశ్రితపద వనజద్వ
యాఖిల। మునిజనవందిత। ఘనఘనాభశరీర ॥మం॥ ఈశను
తాపిశి। తాశనరాణ్మద। నాశమహాత్రి భువ। నేశదశరధాత్మ
జ ॥మం॥ మేరుధరాధర। ధీర దురితహర। నారదాద్యఖిల
ముని నాధచిత్త గేయ ॥మం॥ ధరగూఢ కృష్ణయాఖ్య। వర
కవిపోషకా। సరసి జనా భాసుఖ। కర సురపూజిత ॥మంగళ
మిదె రఘు పుంగవనే నొసఁగు

### 14. మంగళహారతి — చక్రవాక — ఆది.

మంచిసమయమిదే రారా నామనోహరా అనుమట్టు

శ్రీరామచంద్ర। గుణసాంద్ర। హారతిఁ గొనుమిదె ॥శ్రీ॥ ధీ
రకలుషవి। దూరశ్రితమం। దారజగదా। ధార రఘువర ॥శ్రీ॥
రామముఖ జిత। సోమసుగుణల। లామవిబుధ। స్తోమసన్నుత
॥శ్రీ॥ పూషవంశవి। భూషబుధజన। తోషరిపుగణ। శోషమమా
ధన ॥శ్రీ॥ కోసలాధిప। గూఢ కృష్ణమ। నీషహృదయని। వాస
సుఖకర ॥శ్రీ॥

## 15. మంగళహారతి—ద్వారూస్తానితోడి—ఆది

శ్రీరఘువీరా కలుషవిదూరా హారతి నగ సమధీర॥
నారాయణ సంసార విమోచన వారణ రాడ్భ యహార
ణ ॥శ్రీ॥ భూరిరత్న కేయూరకిరీటసు హారనీరకని భాం ।
ఘోరాసురకాం తారకతోరకు తారశూరసుకుమార ॥శ్రీ॥
ధరజార్చితపద సరసిజయుగళా నిరుపమకరుణా లోలా । పర
మపురుషపావనచరిత్రా; మునితతిహారణ; వితరణా; ॥శ్రీ॥
కరుణారసం కలితహృదయ; శుభకర; పరాత్పరా! స
చరాచరపాలకా; సురవర వనవిహార వాస; కృష్ణకవిపో
ష॥శ్రీరఘువీర॥.

## 16. మంగళహారతి:—కమాచ్:—ఆది.

మంగళమనిపాడరే రంగేశునకు జయ ॥మం॥

అంగనలార చెలంగుచుమీరు భుజంగరాజశయనుంగని
భక్తిని ॥మం॥ నీరేజలోచనునకు, బహుపుణ్యకలితకా వే
రితీరవాసునకు మారకోటిసుకు ॥ మారశరీకు, కోమరణీ
మణులారని త్యజయ ॥మం॥ రంగనాయకివిభునకు, ననవర
తాయతమాల్యాంగరాగసంయుతునకు మంగళదుడుసా
రంగనుతుం శుభవ భంగుడునకు శ్రీరంగనిలయునకు ॥మం
సామగానలోలునకు నిజదాసార్చితపద తామరసయుగళు

నకు। భామలారంగా। భూమిని పెరవలి। ధాముఁడైనమన ।
కామదునకు ॥జయమం॥

17. వేంకటేశ్వరు మంగళహారతి—ఆనందభైరవి_ఆది

మంగయాంగయాలింపుమా అనుమట్టు.

వెలఁదులార హారతులివరే। వేంకటరమణునకు॥ పా
లుప్పొంగఁ బల్లెర।ములహిమవాలుక।ములరుచు వెలిగించి॥ వెల
శ్రీయలవేల్మంగాపతికి।శ్రితజనహితమతికి। హేయోపాధివి
హీన నిత్యపథ।యాయుకి;శ్రీమతికి॥ వెల॥ లోకాలోక శరణ్యు
నకు।లోకపావనునకు।శ్రీకల్యాణగు। ణైకధురీణుం।ప్రాకరు
ణాత్మునకు॥ వెలదు॥సకలాపద్వినివారునకు। సంతతసుఖదున
కు।సకలంకాత్మకునకు।సర్వేశున।కకలుషహృదయునకు॥ వె
ఱడిత రి విశాలునకు।నినసమ తేజునకు। గూఢకృష్ణకవినే
ంగునట్టిశ్రీ।వ్యాళగిరీశునకు ॥వెలఁదులారా॥

18. హిందూస్తానితోడి—ఆది.

వేంకటేశున।కి కహారతిఁ।బంకజాస్యలొనంగరే ॥శంకశో
రఁగిశి।వంకరునిపర।పంకజములర్పింపరే ॥కు॥ ధీరుకలుషని।
దూరుశ్రీతమం।దారుజగదాధారునిక। ఏరుతిరుమణి।ధా
రుని య్యొడమీరు।చేమునంబునక ॥వేం॥ శీలుశుభగుణ।

జాలుపరమదయాళుఁ కీర్తివిశాలునిఁ । ఖేలుఁగాంచన చేలు
మునిజనపాలు నెదనిడి వేఁడుచుఁ ॥ వేం॥ గూడకృష్ణని జాడ
కన్గొను వాఁడవనికొనియాడుచుఁ । చేడియలుగుమి । కూ
డిపాటలఁ బాడి వేఁడి సభక్తిగ ॥ వేం॥

1 ౧. మం॥ ఆరభి—ఆది.

కమలామనోహరా। కర్పూరహారతిదెగొనుభవహార
॥క॥ కమలసంభవాద్యమరవినుతపద। కమల! భీమరిపుహర
ణ। అమరేంద్రవినుతమృదుచరణా సుమబాణజనక! భూరమ
ణానమదారివంశదమనాతిసుగుణ॥క॥ కరుణారసపం। కలిత
హృదయ శుభ। చరితమిహిరశత తేజా, వరతాపసకల్ప భూ
జ। సరసీరుహాక్ష! గోరాజతురగవినుత! కుజనాళినిహాత ॥క॥
జ్ఞానాజ్ఞానవిభేదరహిత! సుజ్ఞానఫలద! గాంభీర్య । మాణిక్య
మకుటధర! శౌర్యా। భూనిఖలరూప! గుణధుర్య। నానాప్రమే
య. నతమానివర్య॥క॥ ధారుణిపెరవలి । ధామ! జనార్దన। సార
చరిత' మురవైరి! హిరేంద్రశయన! హరి! శౌరీ। మారమణీరమ
ణ! కంసారి! ద్వారితసురారి! దాసోపకారి॥ క॥ గురుభవహర శ్రీ!
గూడకృష్ణకవి। వరద! నిగమసంచారా । నరమిత్ర! త్రిజగదా
ధార। సురవైరిలోకసంహారా । గరుడాంక! నీలమణిహార !
ధీర ॥కమ॥

## 20. వ మంగళహారతి—జంఝూటి:—ఆది

మంగళమనిపాడరే। అంగనులార । రంగనికో నియాడరే । బంగారుపళ్లెరముల్। రంగుగఁ బూనియు। సంగజజనకమమ్మఁ । గరుణింపుమని ॥మంగ॥ నారాయ ణాచ్యుత । నరహరి కేశవ । సారసదళలోచన । బిరానా యిదే ॥మంగ॥ కంజసంభవాచిత్త । కంజమిత్రలోలం బా । రంజితగుణసముదాయా । అంజలిఁగొనుమనుచు ॥మంగ॥ శంకరనుతభవ । సంకటహరగరు । డాంక!మీా నాంకమోహన । అతులతోషణా ॥మం।శ్రితజనకల్పకక్షి తీరుహా! మందర । క్షితిధర ధర!మురహర । చేకోరాదా రా ॥మంగ॥అవనిగూడకృష్ణాఖ్య । కవివరదాయక । న వమాక్తికాభరణ । నళతిలోచన ॥మం॥

## 21. భైరవి:—ఆది

మంగళంబునీకు । మామనోహర । మంగళప్రి దా!సా । రంగభయవిభంగ ॥మంగ॥ మారాసుందరా । తారాకసకకుధర । ధీరదానవకాం । తారవైశ్వానర ॥మంగ॥ పన్నగేంద్రశయన । భవవిమోచన । ఆ । ప న్నరక్షణామ । హోన్నతగుణగణ ॥మంగ॥ రవికులాబ్ధిసో మ । రమణీయగుణధామ । నవమణివిభూషా । నండూరు

పురవాస ॥మంగ॥ రవిసమాన తేజ । రక్షితబిడౌజ । అః నిగూఢకృష్ణ ॥ కవిమనోనివాస ॥మంగ॥

22. మంగళహారతి—బ్యాంసు:—జుల్వా

హారతి దేమారశుభా । కారముర హార । వారిజా క్షి । క్షీరనిధివిహారశ్రీధర ॥హా॥ హీరశయన । కూర్మ హారిణ । భూరిసద్గుణా । వారిజాసనాదివినుత । సారచరి ణ ॥హా॥ రామభీమసం । గ్రామసద్గుణస్తోమ । శ్రీరమా। కామతారకనామసార్వ । భౌమసర్వసమ॥హా॥ మందరమ హీధ్రధరా ॥ నందదాయకా । నందనందనాముకుంద । సుందరానన ॥హా॥ ధరణిగూడకృష్ణయాఖ్య । వరహృ కేశవా । పరమపురుషమునిజనసుఖకరధరాధవ॥హా॥

23. మంగళ—మొరవినిబ్రోవవేరలనుమట్టు

జయజయ హారతి।జయశ్రీరమాపతి। రయమునసనా సనానుతి । నయముగనొసంగదే ॥జయ॥ నీలఘనాఘన । నిభమృదుకళేబరా । పాలితాఖిలసుర । ప్రచయాపరాత్ప ర॥జ॥ నిఖిలచరాచర । నిచయస్వరూపక। సుఖదాయకా సర । సఖికలితశాత్రవా ॥జయ॥ ఖగరాజవాహన । క మనీయభూషణ । నగవైరిపోషణ। నతశ్రీత్రిలోచన ॥జ॥ నికసమదార్భవ।తరణాశ్రితావన। ధరగూడకృష్ణకవి । వ

రదా!లసద్గుణ । జయజయ హారతి॥

24. మంగళహారతి—తోడి—ఆది.

హారతియదుకుల । వీరాసుగభీరా ॥జయ॥ ॥హా॥ మారజనకసుకు , మారఘనాఘనాభశ । రీర!రణశూర, మహోదారాకృపాకర ॥జాయ॥ ॥మంగ॥ నందనందన! య ర । వింవదళలోచన!గో । విందా!సదానందా!వర,బృం దావనలోలా ॥జయ॥ పారావారాసుతావి । హార! భ వ । దూరా:మురర । నూరా! నగధీరా! ఘనం । హాగా! న రవర ॥జయ॥ ధరణీపరనలిపుర । వరనిలయా! దామో దర! గూకృష్ణకవి । వరదా! శ్రితఫలదాయక ॥హార॥

25. మంగళహారతి—శంకరాభరణం—రూపక

బాలికామణిరాలుసు మట్టు.

నీ । రా । జా । లోచనా । నతవారిజాసన ॥మంగళమిది॥ ॥నీరా॥ పారావారగ ।భీరవరనుకుమార । మేరు।ధీర ॥నీ॥ క్రూరదానవసం । హారమాధవ । ధీరతత్వవి , చారాభ క్తమం , దారా । సా రా । కార ॥నీరా॥ సంగరవర, సా , రగభయహార , రంగావిహాగతు।రంగాగుణనిచ యోత్తుంగా । మంగ।ళాంగ ॥నీ॥ ధారుణీస్థలి । ప్రోద్దా

మపెరపలి । పౌరకృష్ణాఖ్య । సరిదా నిగమసంచారా ।
మారా । శారా ॥నీరా॥

26 వ మంగళహారతి—శ్రీరాగం—అటతాళం.

నీరాజనమునీకు । నీరజనయన । నారవిహీనసం।
సారాబ్ధితరణా ॥నీ॥ ఘోరనరాదసం । హారసుగభీర । నా
రాయణాచ్యుత। నారకర్వూరి ॥నీర॥ పరమపురుషభవ ।
పాశవినాశా । ధరగూడకృష్ణస । త్కవిహృన్నివాసా ॥
నీరాజనమునీకు నీరజనయన॥

27 వ మంగళహారతి—శాంతసుఖమను మట్టు.

అనంతపద్మనాభనీకు ।నములహారతి । అనాధనా
ధపోషకావ । యామయాత్మక ॥అనం॥ అనంతభాగ్యదా
యకాభ । వాంధభాస్కర । అనంతసుగుణరత్నాకర।అ
నంతరూపక ॥అనం॥ అశేషభువన మోహనాభి । యాతి
శోషణా । నిశాటకులవిదారణామ । నిప్రపోషణా ॥అన॥
రాజరాజసేవితాంఘ్రిస । రోజమాధవా ॥ రాజీవదళలో
చనసు । ధీజనావన ॥అనం॥ భాసురాంబు దాభదేహా ।
భవభయాపహా । దాసదాసగూడకృష్ణ । దాసపోషణా ।
అనంతపద్మ॥

28. శివుని మంగళహారతి...ఆదితాళ౦.

హారతీ శివశంకర|శ్రీకర| మేరుధరాధర|ధీరదయా
లో | ఘోరదనుజకాం | తారవైశ్వానర? పారా | వా
రగ | ధీర; పరాత్పర సారచరితభవ| దూరా;సుధీరా
॥హార॥ సామజదనుజవి, రామ; రజతనగ|ధామ; వినిర్జిత|
కామ; జటాకీలిత| సోమ; ఈడితగుణ , స్తోమా; సునా
మా ॥హా॥ శైలసుతామనో , జలజబంభర; శుభ , శీల;
వారణచర్మ|చేల; కృపాకర|పాలితాఖిలసుర |ప్రచయా;
మహేశా ॥హా॥ భాసురబిల్వవనా | వాస;భక్తావనా భ్యా
స; నిస్తులదర|హాస;గూఢకృష్ణయ | దాసమనోబ్జనివాసా
విలాస॥హారతీశివశంకర॥

# కుసుమకులసంజాతలక్ష్మీవిలాసం

## *కోలలపూడి*

29. వది—జంఝూటి—ఆది—కామిర్లైయెయునుజావళిమట్టు

హారతీగిరిజా నాయకా , వరదాయక ॥హార॥ హా
రతి|త్రిభువనా | ధారా! కలుషాటవి | కుఠారామ; హా
దారా; ఫణిహారా! | రణశూరా ॥జయ॥ హార॥ భాసుర
తరక్ష |లాసకుధరనిలయ; దాసహృన్ని | వాసా; సువి |

లాసా; ఘసం । త్రాస; శుభ ॥హా॥ మంగళదాయకా; సితాంగా; వరవృషభతు । రంగా; భవ । భంగాబ్ధిని । షంగా । శివలింగాజయ్య॥హా॥ ధరగూడకృష్ణకవి।వరదా। శ్రితఫలదాయక।పరమశుభా ।కర, మారసం । హార మామనోహరపూజిత । హారతీగిరిజానాయకా

30. అంకాపరమేశ్వరీ మంగళహారతి—తోడి—ఆది

అంకాపరదేవీ । నింకెఱగర్పూరహారతిc । గొనుమో । యంకాళదేవీమహేశ్వరీ । శంకతొరగియక ।లంకమతి నొసగెక ॥నంకా॥ శ్రితవాంఛితార్థప్రదాయినీ । రోగ । శత్రుతీరుహఘోరకుఠారిణీ। తతనవమణిమయతారహారధారిణి ॥యంకా॥ భక్తమనోగేహవాసినీ; । యాది । శక్తి; మూర్తిత్రయరూపిణీ; । ముక్తిదాయినీ; వర , మౌక్తికధారిణీ ॥అంకా॥ధరశ్రుత ధరాధరవాసినీ । ఘోర । తర భవపాశనిర్మూలినీ । పరమంత్రపరతంత్ర , పరయంత్రశమనీ ॥అంకా॥ వర పైరవలి సత్పురావనీ । జననీ । నిరుపమానందసంధాయినీ । ధరకూడకృష్ణస । త్కవిహృన్నివాసినీ ॥అంకాపరదేవీ॥

31 వది దేవిమంగళహారతి—ముల్తాని—జాల్ప.

సరోజశరుని బాలికనే మట్టు.

కర్పూరహారతిదిగోమహా । కాళిభవానీ , దర్ప

దమనురాణిని న్నె । తలంతు భాషనీ ॥కస్తూ॥ మహాళమం దగమనీకనుజ । మదవినాశనీ । పరాకు సేయనేలగిరి । వంశపావనీ ॥కస్తూ॥ అశేషభువనమోహినీమ । హావిరాగిణీ । సశూలఖడ్గబాణతూణ । సలలితపాణి ॥కస్తూ॥ చకితమృగవిలోచనీపా । తకవినాశనీ । అకార్యకార్యకారణీ, మహావిలాసినీ ॥కస్తూ॥ దాసచిత్తకేకినీశా । దంబినీమణీ ॥ భాసుర పెరవలిపురని । వాసజననీ ॥కస్తూ॥ మునిమనోవిహారిణీ । సన్మోదకారిణీ । తనరుగూడకృష్ణయుస । తత్వవితానని ॥కస్తూ॥ రహారతిదిగో మహాకాళీ॥

32 న బారువ—అది——సంగళకిరవన అనుమట్టు.

జయజయహారతీ। శంభురాణీభవ । భయవినాశనీ। పరి । పంధిచయభంజనీ ॥జయ॥ మకర్పితసుమహిత ,మంజులహారతి । సదయంతేగొనుమో । శ్రీదశేశ్వరీజయ ॥ జయ ॥ భండనరాశన । భంజనీ; భైరవీ । ఛండికాంబికాహిమ , సూమ్మధరకుమారీ ॥జయ॥ భూరివివేకినీ పురుషార్ధదాయినీ । కైరవలోచనీ । గౌరీ; శాతోదరీ ॥జ॥ హ్రింకారీక్లీంకారీ । త్రిపురాసురసూదనీ । శంకరీ;హరిసోదరీ। సాధ్వీ;మృడానీ ॥జయ॥ వరసురాసురగణ । వందనీ;శూలినీ ధరగూడకృష్ణయాఖ్య । వరకవిపోషణీ ॥జయ జయహారతి॥

## 33 వ మంగళహారతి—జుల్వా.

హిమగిరీంద్రతనయనీకు । నిదిగో మంగళహారతి॥ భ్రమరవేణి । భవుని । రాణి, పరమపతితపావనీ ।హి॥ శాంతశమద మాదిసుగుణ। సంతత్ఫలదాయినీ, దంతి, గమనీ, దనుజ । దమనీ । సంతతసుఖదాయినీ ॥హి॥ రాజరాజ శేఖరీయ । వ్యాజకృపారసలహరీ । రాజ, రాజా । ర్చితపా।దానీ, రేజ:భాగ్యదాయినీ ॥హిమ॥ పూర్ణిమామృతాంశువదనా; పుండరీకలోచనా;అ । పర్ణా । వర్ణా । శ్రీమ । ధర్మ । వర్ధనీ । సతీమణీ। హిమ॥అంచితమణిమయ కిరీట । హారకటకధారిణీ । వాంఛి। తార్థ।ప్రదాయినీ । భవపాశనిర్మూలినీ ॥హిమ॥ శివమనోవిహారిణీయ । శేషభువనమోహినీ । అవని।గూఢ।కృష్ణహృద। యాబ్జగేహవాసినీ హిమగిరీంద్రతనయ।

## 34 వ మంగళహారతి—ఆనందభైరవి—జుల్వా.

జనకరాట్తనూజమంగళం । త్రైలోక్యనమిత, ఘనపదారవింద మంగళం । దనుజరాడ్వినాశకారిణీ, యనుపమసుఖసంప్రదాయినీ । ఘనఘనాఘనాభవేశి । వనుచునా । మనమునవిడి।మునిశమునినుచు । గొనియాడెద ॥జన॥ అంబుజారి సన్నిభాననా । మరాళగమనా । అం

బుజాప్త వంశపావనా । అంబుజాయతలోచనీ। యాడంబరీ
హే । మాంబరీసత । తంబురునినువేఁడెదనామ । నంబు
నమో । నంబునని । త్యంబనురాగంబునసంబ ॥జన॥ భూ
రిమణిమయ తారహారిణి । సర్వాంసహాకి । శోరహాపి,భా
గ్యదాయినీ । నారదాదిమానినుతప । దారవిందా । పర
మానందా । క్రూరదనుజసంశనాశనీ । సారసముఖి । సం
స్మృతిసం । తారకమంత్రోచ్చారిణి ॥జన॥ వరపినపాద్వర
నివాసినీ। దాశరధిరాణి । నిరతిశయగుణ ప్రచారిణీ । గు
సుకటాక్షవీక్షణీభా । సురవచోవిలాసినీ । ధరణిగూఢకృ
షపోషణీ । నిరుపమభవ । శరధిమహాతరణీ; తరుణిరో
శానుమిదె ॥ జనకరాట్తనూజమ॥

## తెలుపు దగ్గర పాటలు.

### 1. హిందూస్తానితోడి—ఆది.

తలుపుఁదీయవెభామినీ। దయఁదలఁచిబ్రోవవేమా
నినీ । నిలచినినుకనుఁ । బిలువనాతోఁ । బలుకవేమడకో
పమే । యలరువిల్తుఁడు । ములుకులనన । న్నలయఁజే
యఁగఁ దాళనే ॥త॥తలుపుఁదీపనులేలరాననుఁ। బలుకరిం
చుటచాలురా । చెలువుఁడానినుఁ । గలయువారలు । త
లఁపఁగనునిటలేరురా । తులువనామది । కలఁగఁజేయక।

తొలఁగియెట కేనేగరా ॥తలు॥ కాముబారికి నోర్వనేనీ। పే)మఁజూపక తాళనే। భామయెటకో యేగుమననే। నేమి నేరమెఱుంగనే ॥తలు॥ నేరమేమియు లేదురానన।గోరు చేమరియాపరా। కోరికలు కడతేరఁగానా।నారీమణిరతిఁ గూడర ॥తెలు॥ మాయురేయుదినేరమానీ। కాయువిరకువి రోధమా। న్యాయమాయిటులాడనీకిది। హేయమేసు మకోమలీ ॥తలు॥ ఔరమాయకాఁడవురబల।జారచోరశి ఖామణి। ధిరసగుణ విహారతల్లిఁక। పోరబుధ చింతామ ణి ॥తెలు॥ మా యకాఁడనౌచునినునే।మాయఁజేసితినచె లీ। కాయజునిజడికోర్వననుస।న్యాయముగమది నెంచకే॥ తలు॥ ఎన్నియుపముల నేర్చితివినీ। వన్నిబాసలకోర్చితి। వెన్నటికినిను నమ్మరాదుర।వన్నెకాఁడ మురాంతక ॥తలు కొమ్మరోనను నమ్మరాదని। యెమ్మెలాడఁగనేలనే। సొమ్ము సిల్లితిఁ గీరపిక బృం।దమ్ముపలిపెడు రొదలకె ॥తలు॥ మా టిమాటికిఁ బిలచెదవునీ। పాటిసరసులఁగానరా। సాటివా రలు నవ్వనగుము।మ్మాటికిని వేఁదల్లరా ॥తలు॥ ధరణిగూ డకృష్ణయాఖ్యని। వరదుఁడనేవినుకామినీ। కరుణఁజూడు ము పే)మమెయిునను। సరసిజాయతలోచనీ ॥తలు॥ భూ మిలో శ్రీకృష్ణయాఖ్యని।స్వామివైనను శ్రీధర।నీమనంబు నఁగోపమెంచకఁ। గాముకేళినిఁగూడరా। తలుపుఁదీసి తిమాధవానా। వలపుఁదీర్పుముభూధవా। యలరుశ

య్యాపైనిఁజేరుక । కలసిమెలసిరతిశ్రీమగా । అలయుచును
నిరుపురముమారుని । కలనగెల్చెడిరీతిగా॥ తలు॥

2. భైరవి—ఆది.

తెలుపుఁదీయుమా । తరళాక్షివయఁదలఁచి ॥త॥
నిలువఁజాలనీదు । నెమ్మోముఁజూడక ॥త॥ చాలుపో
రగో । పాలచూడామణి । ఈలీలనను గేలి ॥ యేలసేతు
వింకఁ ॥జాలు॥ సమదవారణ । గమనాననున్నఁబో్రవ , స
మయమిల్లిపుడే । కొమరారెనేఁదాళ ॥త॥ మంచిదిరనీ ।
వంచన మానర । కాంచనచేలనీ । కొంచెపుందనము
॥చాలు॥ ఇంచువింటిమేటి । పొంచిపొంచివిల్లు । వంచి
గురిగానేసె । మించుఁబోణితాళ ॥త॥ చెఱకు వింటివ ।
జీరు కాకలకు । వెఱచి తేనిదాని । మఱుఁగుఁజేరఁబొమ్ము
॥చాలు॥ చక్కతైణాక్షియిట్టి । వికలాలాపముల । నకటా
నన్నునాడ । నకముకాదెపో్రడ ॥త॥ జారచోరులను। జే
రనియకము । మేరుధీరమమ్ముఁ । జేరునేయీమాట ॥చా॥
బోఁటీమెంతటి । మాటఁబల్కితివె । హాటకాంగినీన ।
య్యాటఁ గోరుచున్న ॥త॥ వన్నెకాఁడనీ । వన్నమాట
కలలోఁ । గన్నమూటనాలో । నిన్నిమాటలేల॥చాలు॥
అవనిగూషకృష్ణ । కవినిఁబో్రచిసమా । ధవునియానవి
నుమో । యువిదాతాళఁజాల ॥త॥ తలుపుఁదీసితికం ।

దర్పసుందరాంగా । యిలను గూడకృష్ణు । నేలుహారి వీన యిన ॥తెలుపు॥

3. హిందూస్తానితోడి—ఆది.

కమలాయతలోచనీ । గంధగజగామినీ । భ్రమఁ గొని వచ్చితి । వాకిలిఁ దియ్యవే ॥క॥ కమలదళలోచన। కరిరాడ్భయమోచన । భ్రమఁగొన నేటికి। వాకిలిఁదియ్య ను ॥క॥ అళికచ యీమాటలు । బలుకఁగ నేటికే! య లరువిల్తుబారికి ।హా। మనఁజాలనే ॥క॥ మనఁజాలననిక దు । మనికితమందెదవు । ఫణిరాజశయననీ । భావమే మోతోఁచదు ॥క॥ భామనీవెఱుఁగని । భావమేమున్న దే । ప్రేమించియిఁకనను఼ । గాముకేళిఁ దేల్చుము ॥క॥ కాముకేళిలోనిను఼ । గలసి సుఖంచిన । కామినీ సౌధ ము । కాదిది పోపొమ్మిఁక ॥క॥ పోపొమ్మనుచున నుఁ గోపగించకేసతి । ఏపడఁతినిరతి , నేలితినినువిన ॥క॥ ఈ వేపడంతులు । నేలిన నాకేమిర । భావజజనకనే । వాకిలిఁ దియ్యనురా ॥క॥ తెరవానీమదిమంచి , తెరఁగుయోచిం చుమా । ధరగూడకృష్ణకవి । వరదుఁడ శ్రీకృష్ణుఁడ ॥క॥ ఘనఘనాభసుందరా । కారనేవాకిలి । ననువ్రుగఁ దీసితి। ననురతినేలుము ॥క॥ కమలాయతలోచన । గజరాజపో

షణ । మమతఁ దల్చ్వఁదీసితి । మదిఁగిన్క బూనకుము ॥కమలా॥

4. జంఝూటి—ఆది.

కలవాణి ననుదయ, తలఁచితల్చ్వఁదీయుమా, యలరువిల్తుబారికి । నిలమనఁజాలనే ॥కల॥ అలుక యేల నేచెలి, పిలచినఁ బలుకవు । వలపునీపై నిడి, లలినరు దెంచితి ॥కల॥ ఇంతతులువతనమా, ఇంతటిసాహసమా, వింతగానీనిశి । వేళనఁబిలువఁగ ॥విం॥ పంతమూనిననన్ని టు, బలుతూలనాడఁగా, నింతసాహసివినీ, వెవరోమ దిఁదోఁచదు ॥ఇం॥ బాలికామణిరోగో । పాలుఁడఁగాన తే । ఏలననన్నెఱుఁగని । లీలనటించెదు ॥కల॥ ఆలమం దయెవ్వని । పాలొనరించిగో । పాలమాళియిటు, పరు విడివచ్చితి ॥వింత॥ పంచశరుఁడువిలు, వంచికఱుకుట మ్ముల । నించెనేఁదాళనే । చంచరీకాలకా ॥కల॥ అ ద్రిరాజాణనీ । సుద్దులుమానరా, ముద్దగాలనొనను । ను ద్దవిడిఁగలఁచెద ॥వింత॥ అన్నుల మిన్న నే । నిన్నెమికలఁ చితి । చెన్నారననుఁగౌఁగిఁట । జేర్చిముద్దియ్యవే ॥కల॥ ఇన్నాళ్లనుండిమతే, కన్నియనేలితో । వన్నెకాఁడాయే గుమా, కన్నెకవుంగిఁటికి ॥ఇం॥ కూడకృష్ణాఖ్యుఁడు ।

వేఁడనాతని నయఁ । జూతనేనేగిన । జాడనీ వెఱుఁగ వేఁక॥
మఱచితినీ వేగిన । తెఱఁగునేనాడిపప । ల్లఱవులనీమది ।
నుఱకనన్నేలుమా । రారాశ్రీయదుకుల । వీరాకృపాకర।
రారననుఁగాఁగిటఁ। జేరిచిరతినేలఁగ ॥రారాశ్రీ॥

౯. మంచిసమయమిదె రార నామనోహర-అనుమట్టు

వారిజపాణి । కిలవాణి। వాకిలిఁదియ్యవే వా॥ కోరి
నీసరి చేరినినుఁగనఁ । జేరిననుపలుకాడవేమది ॥నా॥ పో
రామిరహార । యిదియేరా । వాకిలిఁ దియ్యను ॥పోర॥
ఏరయిటుమితిమీరినాకడఁ । జేరిపలుచన సేయనేటికి। పో
అసమశరుఁడుకడు । కసిమసంగిననుఁ గసరిసుమశరము॥
।తేయా। బిసరుహాక్షి । యసదునిల్వఁజాలను । లేని । పో
ని । కోప । మేల । చేసెదు ॥వారి॥ ఒరుల మరిగి మెఱ
యు దొరవు నను నిపు । దరసిసరసములనా ।డా। పరమ
మోద । కరమ; పరమపురుమవి । శేవ । భావ । లేల ।
తూలనాడక ।పోర॥ కలికి; మదను । ములికి: కనలిననుని
టు । కలఁచఁదలఁచుటిది యే । లా । వలచియెఱుఁగ । వె
లఁదిరొ కుల । నినువిన । వలదు । వలదు ॥ వలపు । ని
లుపు । సేయఁగ ॥వారి॥ వలపువలననినును । నిలుపఁగ
లుగునతి । వలుమనపురమున । లే । రా । భళిరయింత।
వాఁడవనుచుఁ దెలియక । కలసి । యింత । వలచిమోస

పోతిని ॥పోర॥ ఏమిమోస మొనరించినాఁడసుమ । కోమ
లినిన్నెప్పుడైన । కాముబారి । కోర్వఁజాలనాయెడ । నే
మి। నేర, మున్న । సైచవలెనిఁక ॥వారి॥ చాలుచాలునీ ।
సంగతి తెలసెను । నీలనీరదవి ।భాం । గా। ఏలలేనిపోని
యాసపడియిటు। కా। మేల।తూల।నీకనిలచెద ॥పోరా॥
తరుణి! మంచితరుణమునాయెడఁగని । కరముకరముకో
మ। రా। రా । సరసి । వింత । వింతరతులనేలుము, ధర
ణి । గూడ। కృష్ణ।యాఖ్యాపోషుఁడ ॥వారి॥ వెన్నుఁడ వ
నినిను । నన్నువఁదెలియక । నన్న చేసితినిచా । లా ।
చిన్నదాన । గూడకృష్ణపోషక । అన్నిమరచి । నన్న
రతులనేలుము । రారా । యదువీరా । సుకుమారా । భ
వభయవిదూర ॥ఇటురారి॥

6. హిందూస్తానితోడి—రూపక.

నిలువఁజాల । జాలమేల । తలఁపుఁదీయవే , కలి
కిమిన్నవాపైనీకి । యలుకయేలనే ॥ని॥ అలిగితిననియూ
రడింపఁ । దలఁచియిట్టులఁ , బొలుపుమీఱనర్థరాత్రి ।
మునను వచ్చితే ॥అలి॥ అలరువిల్తుబారికేను । కలఁగి ని
న్ను నేఁ । గలయవచ్చినాఁడలాఁలి । కాదెమానినీ ॥ని
లు॥ వెన్నుఁడనినుఁ । గలయఁదగిన । కన్నెలింతుల , ను
న్నవారటంచుభ్రాంతి । నొందితేలొకో ॥అలి॥ జలదవే

ణినన్నునింత । చౌకచేయకే । అలఁతిమాటలాడియిట్లు । రలఁగఁజేయకే ॥ని॥ ఉరలఁజేయనాకేమియవ । సరముక్తైరా । మురళీగానలోలా! లేచి । పోరా వైళమే ॥అలి॥ పెరవలిపురి । వరనివాసుఁడఁ । దయణిలనన్నిఁక । మరునికేళిఁదేల్చిమదినిఁ, కరుణఁజూడవె ॥ని॥ మామనోహరుఁ డనటంచు । మదినిఁదెలియక । నాముఁజూపితిదానిమరచి ప్రేమనేలరా॥

## 7. రాడే మాయకాఁడే—అను మెట్టు.

భామా; తలఁపుదీయుమా । లేమా నాపయినింత । కోపమా । నాదు ; మోముఁజూడఁగనీకుఁబాపమా కామించిపిలచినఁ । గానిమాటాడవు ॥భామా॥ పోరా । యదువీరా । ఈరీతినర్ధరాత్రంబున । నన్నుఁ, జీరనేటికి నంజనంజన, ధారుణినినుఁబోలు,ధీరులకిదితగవే,పోరా। తగవుకానిమందలించకే । నాతోఁ, దగుమాటలాడి లాలించవే, మృగశాబకాక్షినా । దగుకోర్కెఁదీర్చవే ॥భామ॥ నీకోర్కెఁదీర్పఁగలారమే । యిందు, మై, కోలుఁజెందనసింగారమే, రాకేందువదనయా । రాధికామణికడకు ॥పోర॥ అధికప్రసంగము । లేలనేనన్ను । నల్లరిపాల్జేయఁజెల్లునే । మధులిహాలకా! రాధ । మాటనీకెందుకే ॥భా॥ ఎవరిమాటలతోనాకేమిరా । నీవే । జవరాండ్రఁ

గూడిన నేమిరా । నవనీత చోరనీ । వర నీతుఁడవు లేచి॥పో
ర॥ చేడెవన్నిటురవ్వసేయకే । మంకు । వీడినీకొఁగిఁటఁ
జేర్చవే । గూడకృష్ణాఖ్యుని । యేలువాఁడ నేసత్య॥భా
మా॥ తెలిసి తెలియకను నేనాడిన । మాట ॥ లెడఁదనుం
చకను నే స్తంబున । జలజాతనయనునన్ । గలసిసుఖించు
ము ॥రారాసుకుమారా॥

8. రావుచేసెన వేల రాజగోపాల-అనుమట్టు.

ఇందువదన। సౌందర్యసదన॥ఇం॥నందనందనుఁడనా
యందునయకనవె ॥ఇం॥ ఔరాజారా , చోరాగ్రేసరా
।ఔ॥ నీరావు । తెలసెను । పోరాయఘుదూరా ॥ఔ॥ కో
మలీ! నే, నేమిచేసితినే। కాముని కేళిలోఁ।గలయువచ్చినన
న్నుఁ, బ్రేమించకిటుమూరు । మోముపెట్టెదవు ॥ఇం॥
ఈపగిదినీ। వననేలపూని । నాపాటివారలిం , కేపట్లలేర
ని । గోపాలమౌళి: యిటు । గోముఁజూపకురా ॥ఔ॥ కల
భగమన । జలజాతనయన । చిలుకలుగుమికూడి, కలకల
ములనన్నుఁ । బలుకరించఁగసాగె , నిలువఁగలానా ॥ఇం॥
కరుణాభరణా, ఖగరాజగమన , కరమునాతోనిట్లు । వి
రసోక్తులాడెదవు । పరువుకాదింటికి । పదరా నెరజాణా
॥ఔ॥ జలదవేణి। జలజాతపాణీ । ఇలగూడకృష్ణాఖ్యు । నే
లుకృష్ణుఁడనన్నుఁ । బలుచననేయకేఁ । గలయుమీవేళ।

॥౩౦॥ తారాబాల। రాజగోపాల ॥ కూరిమిమీరననా। గా
రవించుముమరు। బారికిసేఁదాళ। వార్ధిగంభీరా ॥రా॥

బువ్వముబంతిపాటలు.

1. బేహాగ్—అట.

తరుణీ! శ్రీహరిబువ్వమునుఁగన। నిరుపమానము
తోఁచెఁగా। హరికిఁగాక్షి వైభవంబులు। పెఱలకౌనెనిజం
బుగా ॥త॥ పచ్చలపందిళ్లఁగదళీ, పాదపములనునాటిరి।
మెచ్చుగుల్కువిచిత్రపటముల। నచ్చటచ్చటవ్రాసిరి॥త॥
కళలఁదేరెడిదీపములకనుఁ। గవలఁజూడఁగఁజూడఁగా। న
ళినమిత్రసహస్రసత్కాంతులనుగేరునిజంబుగా॥త॥ హ
ల్లకల్లోలములఁజేసెడి। యెల్లవారలఁజూడుమా। ఫుల్లజ
లజదళాక్షి! వజ్రుల। నెల్లసొగసొకెంచుమా ॥తరు॥ సర
సపల్లాపములనాడుచుఁ। దరుణీమణులుముదంబుగా। పర
సిపేర్పేర్వరుసలనునోం। డోరులుపరిహాసింపఁగా ॥తరు॥ప
ప్పులునువరి। వంటకంబులు। గొప్పదోసెలుపూర్ణముల్
అప్పడాల్వడియంబులునుబల్। మెప్పుకొల్పెడిశాకముల్
॥తరు॥ పెరుగు; సద్యోఘృతముచూడఁగఁ। గరమునూరి
నకాయలున్। దెలివ! యాదెసఁజూడుమదె। సుందరు
లుపిలిచెడిరీతులున్ ॥తరు॥అహహాయీబువ్వమునుఁజూడఁ

గ। నివహపరంబులజూడగా। మిహిరకులతిలకునకు, శీతా।
మహిళకను మోదంబుగా ॥తరుణి॥ ధరణిశ్రీపెరవలి పుర
నం। భరితుండై విను కామినీ। యరసి గూడ కృష్ణాఖ్యుం
బోంచెడి హారినిం గనని దెవేళని ॥తరుణి॥

## 2. బువ్వము బంతి పాట.

నరహరిబువ్వముతీనరారు। ధరమును నెటలేదీతు
రు ॥న॥ నవమా_క్తికాదుల। నవిరళముగనిడి। రవనిక
లుకలపం। దింటిలోన ॥న॥ మిహిరోపలంబులే। బహుదీ
పపఙ్క్తులా। నహహా మనమలరున విచూడ ॥న॥ చిత్తారుప
టములు। మొ_త్తములనుగనం జి_త్తము ప్రేమాస్పదముం
జెందు ॥న॥ రంభోర్వీజంబుల। జృంభణముగనల। గంభీ
రంపు పందిటనుంచిరి ॥న॥ నెచ్చెలులతోంగడు। ముచ్చట
లాడెదు। నచ్చెలులంజూడంజోద్యమాను ॥న॥ తరళాక్షు
లందఱు। సరసనల్లాపముల్। పరితోషమున నాడుచుండ
॥నర॥ మందేభయానలందంపందందిరుగుచు॥ నందిరివడ్డన
సేయుముందు ॥న॥ సారరసాన్నముల్। భూరిను శాక
ముల్। కోరినపిండివంటలిపొంద ॥న॥ ధర వెలయుం బెర
వలి। ధాముంకాశ్రీహరి। కరుణమనలంబోంచుచుండ ॥న
రహరి॥

౨. పాట. నిన్నుకోరినాను అందముగా అనుమట్టు.

ఇంతిరో। హరిబూ , బంతిరమ్యమది। యేమని తెల్పుదు । వింతవింత , లుగఁదోఁచెడినీ । ఘనవైభవములు ॥నిం॥ రంభోర్వీజముల , రాణతనరు పందిటిలో నుంచిరి । అంభోజాక్షి! మణులే, ఘనదీ। పములుగానుంచిరి ॥ఇం॥ ఉల్లములనురం । జిల్లఁజేయు చిత్తరువుపటంబులు। నెల్లెడలహరిగూ । పమెయం । చునుబోధించెడు ॥నిం॥ నారీమణులు । నవమణీమయ సుకలాపములనునిడి మేర । మీరఁ। గనుహాయులుగని । చ్చటికరుదెంతురు ॥ఇం॥ సరసోక్తుల । సతులొక్కరి నొక్కరు పరిహసింతురు , సరసిజా । క్షుని రుక్మిణినొక । పీఠముపై నిడిరింతి ॥ మో । ద । మూ । రఁగ । ముగిదలుపాటలఁ గ్రొత్తవిపాడుచు । భేదా । భేద । ములులే । కనుసర । సంబులనాడెద॥రిం॥ అంచితంబగుశా । ల్యాన్నతకరిఘృతసూపశాకములు , మంచియు । క్కౌ ఆలఫల।ములనెల , మినివడ్డించెద ॥రిం॥ కైర ॥ వా । క్షిరాశిరికాం । తుఁదురుక్మిణితోడనుబువ్వము । నార । గించఁగనుచూ । చెడివా । రలదేభాగ్యము ॥ఇం॥ గూ । డ , కృష్ణాఖ్యు । జాడఁగనుంగొనిపోరిచెడిశిరిహరి ॥ వేఁడినట్టు। లుగనద్వరములనొసఁగెడునిగ తి ॥నింతి॥

4. పది శాంతసుఖనిరంతర ౹ అనుమట్టు.

ఇంతి! యీబువ్వము ౹ బంతిసోయగ , మెంతచో
ద్యమె ౹ స్వాంతిమునక ౹ త్వాంతలీల౹ వింతమీాతెనే ॥ఇం॥
కంటికింపగున ౹ నంటులమొద ౹ లంటనాటిరి ౹ కంటివా
వాల్గంటి. భోజన ౹ మంటపాన్నతిఁ ॥ఇం॥ పోలఁగ్రొ
న్నెల ౹ తాలఁదసరుకు ౹ డ్యాలపైతగఁజాళువామేల్ బొ
మ్మలవేన ౹ వేలువా్రిసిరి ॥ఇం॥ మేలుఁగుల్కుము ౹ త్యాఁ
లబలుతోరణ లు ౹ తరణితో , మేల౹ మూడుసన్మణిదీ ౹
పాలుచూడఁగఁ ॥ఇం॥ వన్నెమీారిన౹సన్నబియ్యఁపు౹ ట
న్నమాత్రలో ౹ నెన్నఁదరముకాని కూరలెన్నొ చేసిరి ॥ఇం
అప్పడాల్వడియాలునుక్కెఅల్ ౹ గొప్పదోసెలుఁ మెప్పు
గల్గుగోఘృతంబు ౹ దొప్పలాదిగఁ ॥ఇం॥ అవనిగూడక్ష
ష్టాఖ్యనేలుమా ౹ధవుఁడునేఁడిటఁ ప్రవిమలాంతరంగు
డగుచు ౹ వరములివ్వఁగఁ ॥ఇంతి॥

5. పది ఆనందభైరవి—ఆది.

మందయాన యాలింపుమా అనుమట్టు.

జవ్వనియీా ॥ బువ్వముఁగనఁగా ౹ నెవ్వరికినిఁద
రమె ౹ ఇవ్వసుధలోఁ ౹ గవ్వపుములఁదాల్చిన ౹ కమలా
తుఁడకుగాక ॥జ॥ ఘనతరమాక్తికతోరణముల్ మణిమ

యదీపములు । గణుతింపఁగఁగా । మినుల శ్రేణులను। ఫణి పతికినిఁదరమె ॥జ॥ రంభాపత్రములెల్లవి । జృంభణముగఁ బరచి । రంభోజాక్షిరో । గుంభనముగ శాత । కుంభ మంటపమున ॥జవ్వ॥ వరశాల్యాన్న సుసూపముల్ । ధరఁ గల శాకములు। పెరుగుఘృతము। లరయఁగభక్ష్యంబుల । గురు తెలుఁగఁగఁదరమె ॥జ॥ తరుణులెల్లఁదమపంతముల। సరసంబుగఁ బాటలఁ బాడ । నరిదియమ్యేయా । తెలుఁగుఁ గనుంగొన ॥ సరసిజాస్యవినవె ॥జవ్వ॥ ఎంతని యేవివరిం చెద । వింతలన్ని కాంత । స్వాంతమలరుబూ । బంతిఁగ నుంగొన । నెంతవారికైన ॥జవ్వ॥ ధరణిగూడకృష్ణాఖ్యు ని । వరదుండగుశౌరి । తరళాక్షిరో! యీ । సరణిఁజూ డఁదా । నరుదెంచునుకోరీ ॥జవ్వనియీబువ్వముఁగనగాఁ నెవ్వరికి॥

## న లు గు పా ట లు.

1. బారువ—ఆది—మంగళకరవన అనుమట్టు.

నగలాడివదినెనీ । యొగతాళిమానవే । మగువాని న్నెఱుఁగని । ముగిదెలెవ్వారెయిట ।వ॥ తగుదునను చు నగు । మొగమునుజిగిమించఁగ । మొగవారి మ్రోలనీ । టు గఁగుల్కసేటికే ॥వగ॥ చక్కనిసతినే నొక్కతెనేయని

టక్కులాడినీమదిఁ, డెక్కులుమానవే ॥వగ॥ బోఁటిరో! స్నుఁగను। గీటెడ వేలయుల ।నాఁటినీసంగతి । పాటకమానవే ॥వ। మించుఁబోఁణిరో:కడు కొంచెప్పుఁబనులకు, వంచనమానియిటు । నంచరించనేటికే। వగ। ధరణిఁబెరవలిపుర । ధాము మల్లేశ్వరు । చరణార్చనలమదిఁ నెఱుఁగకఁ జెఱలాడెడి ॥వదినె॥

2 వది వనమెంతో ఘనంబయ్యెగా అనుమెట్టు.

వదినెనీవిటుసేయఁ। బరువవునె తెల్పుమా ॥వది॥ ఙెవరింత లేకపోయె । మదినీకుఁజెడినదాయె । ముదితసంతసమాయె । నవరకఁదర్లమా ॥వది॥ మానినీ! నీవను । మానము నెంచక । కానిపనులుచేయ । ఘనమానెతలపోయజాణ । వీటిని బాయ । సాన మేడఁబోయె ।వది॥ నెరసినకురులకు । మెఱుఁగరంగులఁబూయ । తరుణిరో చిఱుతవే । మఱియావగానవే। ధరనెంతగుణవతివె। సరసములెఱుఁగవే ॥వది॥ ధరగూడకృష్ణాఖ్యుని । వరదుఁడాశ్రీహరి గరితరో: నినుఁజేరి । కరుణింపడాయెకోరి । దురితగుణము వీడి । దిరుగువగలాడి ॥వదిననీవిటుసేయపరువవునె॥

3. వది జంఝూటి—ఆది.

వదినెరో నాయెదుట । నదరెనవది యేలనే ॥వది॥

విదితమయ్యెనీవల ॥ ముదుసలితో పవ్వట ।పది॥ జెనరక నహ రేయిని । సదనము వెలువడి । మదిలేనివానితోడ । ముదిత!కలయలేదంటే ॥వ॥ అంగన! సునాతిని బంగరుసొమ్ముల । తొంగలించుచునషగవా । వెంగలి తెలవా ॥వ॥ ఇంతిరో నీవెంతటి హోంత కారివెగుణ । వంతులంగూడె నెంచవు । ఒడలెఱుంగవు ॥పది॥ ధరగూకృష్ణాఖ్యుని వరదుని శ్రీహరి । గరితరో. నినుమన్నించునా। కరుణించునా ॥పదినెరో.

4. పది జో బన భేటేజాన్ బదీలావ్ బేగియావురే

నాతినీవిటు । మూతిదిప్పక । నీతిగాన వే । నాతిరో నీతిగాన వే । నాతివాగుబోతుతనమునీ । లాంతివారితో జగడమిా । రీతిసేయుట । ఖ్యాతిగాదిక । నాతురమున ॥ రోతతనమున ॥నీతి॥ మొన్న రేయిచే । పన్నులనుర । మ్మన్నపాఱునిం జేరినీ । వన్నిచేయంగం । గన్నవారికి । తిన్నంగమరియాదజరుప ॥నీతి॥ టక్కరితనమున । నొక్కవిటుండునిను । మక్కువతోంబల్కరించంగా । నక్కఱకలదేని । రొక్కమిచ్చినీదు । మక్కువతీర్పక । మరలిపొమ్మనలేదా ॥నీతి॥ పలువురిలోపలం । బలుగాకితనమునందాలువమాటలాడకే చెలియలందఱునిన్నుం। బలుచనసేతురు కలికినోరునుమూసి । తొలంగిపొమ్మిట బాసి ॥నీతి॥ కరుణ

తోనేఁదెల్పు । తెరఁగులపిలిచిననీ । దురితగుణములడంచి
యీ । ధరణిగూడకృష్ణ । వరదుఁష్టోముర వైరి । గరిత
రో! నిన్నుఁగ । సరగునఁ బ్రోచునే ॥నీతిగాన వే॥

5. వ టపాట, నారపాట—రారాపోదాము. అనుమెట్టు.

ఔనౌనేసంగనాచి । నీనడతలింకదాచి । మాన
వతివౌదు వేయీ । మానెనవారిలోవేచి ।ఔ॥ అద్దిరా
చీఁకటితప్పు । నందులోఁ గొందు వేమెప్పు । ముద్దరాలానీ
ఁ చెయ్యి । పొల్పు కాదిస్సిరో ॥యెన్నడౌనౌ॥ మానవా
నీగొనము । మంచి తెల్పెదవినుము । కానిపోనికోపమీ
వీ । కరణిఁజూపరాదుఘన ॥మానే॥ కొంటెలమారినీ ।
గొనమెల్లఁదెలసె మొగని । పొందెదిగులు । కొంటెవఁట
జంటకాని నెఱువుగనౌసంగెన ।నౌనె॥ భూమిపై యీపిం
త । లేమెఱుఁగ వెసుఁత । పేర్మిడి వెన్నెల రేలు । భీతి
తోఁచునఁటివఁట ॥యెందు కేసంగనాచి॥ చేడియానామా
ట । చెవియొగ్గి పెరవలిపీట । గూడకృష్ణకవినిఁ బ్రోచెడి। గూ
ఢ పాద్యాభమణు వేఁడ వే ॥ఔనౌనేసంగనాచి॥

6. ప్యారె ప్యారో బనా యోబనా యోబనా - అనుమట్టు.

చాలుచాలేసఖి । సరసీజముఖి । కాలకాలముల

నుఁజూపవలదా । పోనీ । పెద్దపిన్నలభయముకలదా । వ
లదా । ఆ । హా । హా ॥చాలు॥ పంటవలంతిపై సిట్లు సే
యఁగా । నీదు । కొంటెతనముమాకుఁదెల్లమయ్యెగా !
బాగుగా । న । య్యా । రే ॥చాలు॥ కాందిశీకమిట్లువి
డచితేలనేయప । నింపలపాల్పడఁజెల్లునే । తగునే । ఔ
రౌ । రా ॥చా॥ మందమేలములాడనీకు । ధర్మమా । నీ
దుఃచంపమిటులౌటపాపకర్మమా । మర్మమా । భ।ళి।రే
॥చాలు॥ గూడకృష్ణయాఖ్యునిజో్రిచుహారిని । సుంత ।
వేడఁజూడపిఁకఁదెన్నెదని । ధారుణి । ఔరౌర ॥చాలు॥

7. కాఫీ—చాపు.

చాలుఁనీయుపన్యాసము । పడనేల యిటు రోసము
॥చా॥ బాలికామణిజెసి । మాలిమాటాడకే ।
వాఁలాయ । మీాఁలాటిగోలనీకేల ॥చా॥ సదమునఁ జేరి
కు । లెక్కదవెంతదానవే । అదిరా । నిను । మదిరా। ఛీ!
పదరుబోతనరా ॥చాలు॥ చెన్నఁటి్వైనాతో । నిన్నిమా
టలాడ । కున్నసకిమిన్న । నీకు । బన్నమేమన్న ॥చాలు॥
గూడకృష్ణకవి । నేలుహరిదయ । వీడఁజెరలాడనీ।ప్రోడ।
తనమేల ॥చాలు॥

8. వన్నెకాఁడ చెన్నరాయ భూపాల-అనుమట్టు.

ఎంతదానవబలా । నీ ॥వెం॥ నీ । కింతభ్రాంతియే

లు | లేనిగోల ||ఎం|| కూళతనముమాను | బాలా! యీ సభలోను | కాలమనియుc | గాలముకాదనకను | వేలుపు సొగసుల || నేలంజేసెన ||వెం|| నెయ్యమరయరాదా| నీకియ్యదిమరియాదా | కయ్యముమానిలాcతివారితో | నీ | వొయ్యనcబోవcగ | నెయ్యదితెలవగు ||నెం|| గూడకృష్ణకవిని | మది | కోరిబ్రోచుహరిని | వేcడినచోనీ | వాదుకలడcగుచుc || జేడెలవలెనీ | పోడిమిహెచ్చును ||ఎం||

పూ ల చెం డ్ల పా ట లు.

ముద్దుబెట్టరాదా—అనుమట్టు.

పూcలచెండ్లాడవె | పూబోణిధవునితో | బాలికామణిమల్లె | పూలబంతినివేసc | గేలcదాల్చిచెల్వుని | కేలరసిూనుంచుచు ||పూ|| ధరణీదేవులుమంత్రా | ర్థములనుcజదువcగ | సురదుందుభీనిస్వన | మురజలు | మ్రోయcగc ||బూ|| వారాంగనామణులు| వరనాట్యవిధులను | మేరమీరcజూపcగ | మృగనేత్రికోనబుగc ||బూ|| గూడకృష్ణకవిని | కోరిబ్రోచుశ్రీహరి | చేడియనీముఖపు | చెల్వమునకలర ||పూల||

2. పది జంఝూటి—రూపకం.

తనిచను వెనయఁగఁనతి । కాదెమానినీ ॥బం॥ కాంతనొ చే, మంతిపూల । కందుకముత్రన, దంతివరదు, నురము నాటఁ, దాగ్చమా వెసర్ ॥బం॥ కలికిరొచినునగ వెగయ గీ్రి । గంటిచూపులర్ ॥ జెలుపుని దెస । నలఁతిఁగన్గొని। సింగారంబుగ ॥బం॥ తడసిననినువిభుఁడుకోప । పడఁగ నొసుమీ । బడ లెదెనీపి్రయుని(మోలఁ బాటలాధరీ ॥ బం॥ ధరణీగూడకృష్ణయాఖ్య, వరఁదుఁడేమని । నెరఁన లఁచునొ నీచుచలము । నరసికామినీ ॥బంతులాడ॥

3. నది ఈథన మేమరి యాధనమే—అనుమట్టు.

పూలచెంగ్లమనమాడుదమా । పూఁబోణిరొకవ గూడుదమా । బాలామణినీవినవినుమా । బదులునుడువ యోచింపకుమా ॥పూల॥ పోలనీకునాకునునీడే, ఫుగు షోత్తనః! నన్నిటులాడె । దేలయంటినేనలనాఁ। డే వీలుప డదుచనుమిదివాదేపో ॥ బేలమాటలాడకుననబోణీ । పూలబంతులాటనీకునీడేమి । కాలమేలగడపెదుకలవాణీ । కేలునాఁచుమరమరమాని॥పూ॥ పసిదానసుమకందుకము విసరకుమానా । పైకరము । వెసనాదగుమున వినివిను ము । పొసఁగనిజతనముఁసేయకుము ॥పోల॥ అళికచ!యి టులాడెద వేల, కలఁచెదుస మదిసద మిలా । యలరుబంతిఁదాల్చుము । కేలా । నిలువఁజాలనలఁతియుగోలా ॥

పూల॥ ఎంతనియోబ్రితిమాలెదను, దంతివరదయిదె(క్రమో
క్కెదను । వింతవారలిదిగనియికను । సంతపెట్టుదురు వీ
ధులను ॥ పో। వింతవారికిటు వెలువఁగను । వెలఁదియనవ
సరమియ్యదనుగోంతి! సు తనాదెసఁగనుము । గూడకృ
ష్ణకవిపోషఁడను ॥పూల॥

4. వది కియాము——ఆది.

పాప్రేయగిరికన్యకాయాకుదామా । పూలబంతు
ల, మేలయినమల్లెమొల్లలలోడఁ దనరారుమేటిజాజుల ॥
బా॥ భేరిమర్దళదుందు, భీనాదములుభోరుకొలుగఁగా ।
వారకామినులుసింగారంపుఁబద్దెముల్ । పాడియాఁడగా।
పా॥ బాడబులుఁదీవెనఁబ్రాలుతమకేల । దాలిచికదుఁగ ।
వేఁడుక జనింపవేదోక్త మంత్రాశీస్సులోలినుడువఁగ ॥
బా॥దుగపుట్టువులమై , దువులుజయధ్వనులు । నిగుడఁ
బాడఁగా , మృగశాబకాక్షి నెక్కుముదంబున మేను । గ
గుర్పొడఁగ ॥బా॥ తెరగంటిదొరలు పొరిపొరిని మన
పైనివిరులఁజల్లఁగఁ సరసిజానన! సరసనల్లాపములలాఁతి,
తెలుపలాఁడఁగ ॥పా॥ ప్రీడఁజెందఁగనేల: బాలాసుశీలా
వేమరునిటగూడకృష్ణాఖ్యు నేలేడిశంకరుండనింకేల య
లసట ॥పాప్రేయగిరికన్యకా॥

లాలిపాట—మధ్యమావతి—ఆట.

లాలిరవికులచంద్ర। లలితగుణసాంద్ర । లాలిన తమానీంద్ర। శ్రీరామచంద్రా ॥లాలి॥ జనకసుతాకుచ స్తబకాతిలోలా । మునిమనోబ్జవిహార । వినుతగుణశీల ॥ లాలి॥ కౌసల్యాగర్భవా । రాసిహోమధామా । వాసవాదిని లింప । వర్గనుతనామా ॥లాలి॥ లలితశమదమసార । విల సీతో రా । జలితఖలకాంతార । దశరధకుమార ॥లా। పి శితాశనకులాగ । శోభనసుశీలా । కుశలరూపకమహా । తిశయగుణజాల ॥లాలి॥ చామీకరగిరీంద్ర । సన్నిభగభీ రా । సౌమిత్రిహృదయప ఙ్కరదివ్యకీర ॥లాలి॥ దశకంఠ కంఠలుంఠితబాహుమూల। కుశలవార్చితపాద । కువల యసుచేలా ॥లా॥ పెరవలిపురాం । తరసన్నివాసా । ధ రగూడకృష్ణస । త్కవిమనోల్లాసా ॥లాలి॥

---

క॥ మంగళముపార్థినేశ్వర
మంగళముమహానుభావ! మంగళముశివా
మంగళముపార్వతీవర
మంగళముమహోత్తుగమన! మనసిజదమనా॥

ఈపొత్తమునకు ద్రవ్యసహాయ మొనరించినవారి
నామసంఖ్యావివరము.

తూ ము లూ రు.

| | |
|---|---|
| శంకరమంచి నరసయ్యగారు. రు. | 1—0—0 |
| భాగవతుల వెంకటప్పయ్యగారు. | 1—0—0 |
| రొంపిచర్ల కృష్ణమాచార్యులుగారు. | 1—0—0 |
| నాగాచార్యులుగారు. | 1—0—0 |
| కొల్లి కృష్ణారెడ్డిగారు. | 1—0—0 |

కొల్లిపర.

| | |
|---|---|
| జొన్నల కోటిరెడ్డిగారు. | 1—0—0 |
| గుదిబండి రామచంద్రుడుగారు. | 1—0—0 |
| ఈ నరసింహంగారు. | 1—0—0 |
| యీ గోపిరెడ్డిగారు. V. | 1—0—0 |
| యీ నాగిరెడ్డిగారు. V. | 1—0—0 |
| వుయ్యూరు రామయ్యగారు. } భీమవరపు చినగురవారెడ్డిగారు. } | 2—8—0 |

చావలి.

| | |
|---|---|
| పోతుకుచ్చి లక్ష్మీనారాయణశాస్త్రీగారు. | 1—0—0 |
| చావలి శివరామయ్య. | 2—0—0 |
| మాజేటి వెంకటనరసింహంగారు. | 1—0—0 |
| గాజుల వెంకటసుబ్బయ్యగారు. | 1—0—0 |
| యీ వెంకయ్య. | 1—0—0 |
| యీ రామకృష్ణయ్య. | 1—0—0 |

## పెరవలి.

| | | |
|---|---|---|
| చెరువు హనుమాయమ్మగారు. | | 1—0—0 |
| జంధ్యాల దుర్గాంబగారు. కొల్లూరు. | V. | 1—0—0 |
| వేమూరి రామకోటయ్యగారు. | | 1—0—0 |
| చావలి చంద్రయ్యగారు. | | 1—0—0 |
| కోట శ్రీరాములు. వాసుదేవుడు. | } | 0—8—0 |
| విష్ణుమొల్కల వెంకటరెడ్డిగారు, గ్రామమునసఫ్. | | 1-0—0 |
| విష్ణుమొల్కల వెంకటకృష్ణయ్యగారు. | | 0—8—0 |
| మత్తిసుబ్బయ్యగారు. | | 1—0—0 |
| లింగినేని బసవయ్యగారు. | | 1—0—0 |
| దాది బసవయ్యగారు. | | 0—8—0 |
| దాది సూరయ్యగారు. | | 0—8—0 |
| జొన్నకూటి అప్పయ్యగారు. | | 0—8—0 |
| దండె అబద్ధాలుగారు. | V | 1—0—0 |
| కంభాల అప్పయ్యగారు. | V | 1—0—0 |

## పెరవలిపాలెం.

| | |
|---|---|
| విష్ణుమొల్కల యల్లయ్యగారు. | 1—0—0 |
| చవ్వాకుల వేంకటకృష్ణయ్యగారు. | 1—0—0 |
| చవ్వాకుల కృ॥ కో॥ కోటయ్యగారు | 1—0—0 |

---

